# వీరస్వర్గము

రచయిత:

ఉభయభాషాప్రవీణ

ప్రతాప రామకోటయ్య

వెల రూ. 0-8-0

సంస్కృతి ప్రచురణ

41

సంస్కృతి ప్రచురణ - 41

వెల ఎనిమిది అణాలు.

ద్వితీయ ముద్రణ

10-6-1953

ప్రకాశకులు:

కల్చరల్ బుక్స్ లిమిటెడ్,

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.

ముద్రాపకులు:

స్వతంత్ర ప్రెస్,

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.

# 1

అది విజయనగరసామ్రాజ్యమును రామదేవరాయలు పరిపాలించు కాలము. ఆనాటి ప్రాతఃకాలము మిగుల శోభాయమానముగ నుండెను. రాజవీధియందలి రమ్యహర్మ్యములపై ఉదయభానుని లేతకిరణములు బంగరు పూతలుపూయుచుండెను. విశాల రమణీయములైన రాజవీధులపుడే జనసమ్మర్దము లగుచుండెను. ఎటుజూచినను శైవ, వైష్ణవ దేవాలయములు అద్భుత శిల్పకళానైపుణ్యముతో శోభించుచు కన్నులకు విందులొనరించుచుండెను. ఆ దేవాలయములయందు అపుడే పఠింపబడుచున్న గంభీర పురుషసూక్త నినాదములు యాతాయత జనములను మిక్కిలి ఆకర్షించుచుండెను. చాలమంది యపుడె దేవతాదర్శనముచేసి వెలుపలికి వచ్చుచుండిరి.

రాజవీధియందిరువైపులను నానావిధ పరిమళములు గుబాళించుచున్న పువ్వులను పుష్పలావికలు విక్రయించుచుండిరి. వ్యాపారులు, తమ యంగళ్ల ముందుభాగమున రమ్యములైన మంచెలను గట్టుకొని అందు గూర్చుండి తమ సరకులను విక్రయించుకొనుచుండిరి.

ఇట్లు ఇరువైపుల పుష్పలావికలు, వ్యాపారులు స్థలమును ఆక్రమించినను, ఏనుగులు, పల్లకీలు, శకటములు గుంపులు గుంపులుగా ఇసుకవైచినను రాలకుండునట్లు నిరం

తరముగా ప్రయాణించుచునే యుండెను.

ఆనాటి ప్రజలకు పుష్పములన్న ప్రాణము. అందువలన పుష్పలావికల వ్యాపారము నిరంతరముగా సాగుచుండెను. ఒక్కొక్క దినుసు సరకులను వ్యాపారులు అమ్ముచుండిరి.

రత్నవర్తకులు తమ వజ్రవైఢూర్య మాణిక్యాదులను రాసులు రాసులుగాబోసి విక్రయించుచుండిరి. ఆ దివ్యనగరము దేవతానగరమువలె ఎంతచూచినను తనివిపుట్టింపక యుండెను. నేడు రామరాయలు సభామంటపమున కొలువు తీరియుండెను. సభయంతయు గంభీర నిశ్శబ్దముగానుండెను.

అతని తమ్ములు తిరుమలరాయఁడు, వేంకటాద్రి యెడమవైపున గూర్చుండియుండిరి. కుడివైపున మంత్రి సామంతాదులు ఉచితాసనముల నాసీనులై యుండిరి.

రాయలు తొంబదియారువర్షముల వయోవృద్ధుడు. బంగారుఛాయగలవాడు. అతని ఆపాదమస్తకము రాచఠీవి తాండవమాడుచుండెను. ఆకర్ణాంత విశాల నేత్రములు దివ్య తేజములొలుకుచుండెను. పెదవులు మధురహాసములు చిందుచుండెను. ఒడ్డు పొడవుగల ఆ రమణీయమూర్తి అలవోకగా తమ్ముల నుద్దేశించి, "వేంకటాద్రి! వింటివిగదా గూఢచారి తెచ్చిన వార్తలు. ఈ సందర్భమున నీ యుద్దేశ మేమి?" అనెను.

వేంకటాద్రి : (లేచి నమస్కరించి) మహాప్రభూ! మనము కడు అప్రమత్తులమై యుండవలయును. 'చిన్నపామునైనను, పెద్దకఱ్ఱతో కొట్టు'మన్నారు. మఱి యిపుడు

వచ్చినది పెద్దపాము, కావున మఱింత జాగరూకులమై యుండవలయును.

రాయలు : తిరుమలరాయా, నీ యభిప్రాయమేమి ?

తిరుమలరాయలు :(లేచినమస్కరించి)అయ్యా!మహమ్మదీయ సుల్తానులందరు ఏకమై వచ్చుచున్నారట. వారివారి పూర్వ వైరములు మరచినారట. ఇందేదో నిగూఢ తంత్రము, దృఢనిశ్చయము కలవని గోచరించు చున్నది. మన మేమాత్రము ఏమరియుండరాదు. కడు శ్రద్ధ వహింపవలసిన సమయమిది. యుద్ధసన్నాహ ములు వెంటనే ప్రారంభించవలయును.

రాయలు : తిరుమలా! 'సమరభీమ' బిరుదు నందిన ప్రసిద్ధు డవు. వేంకటాద్రి! 'అభినవార్జున' బిరుద సంశోభి తుడవు. పైగా శ్రీరామునకు లక్ష్మణుడట్లు ట్లుల నన్ను సేవించువాడవు. ఇట్టి మీ రిరువురు ఇంత చిన్న విషయము అంత పెద్దగా వర్ణించి, తొందరపడుచు న్నారు. మీ తొందరపాటు నవ్వుపుట్టించుచున్నది కూడను. ఈ సుల్తానులలో మనశర ణందనివా డెవ్వడు ? వారు శిశువులవంటివారు. విడివిడిగా వచ్చి నను, కలసివచ్చినను ప్రమాదమేమియు నుండదు. అంతధైర్యముచేసి వారు యుద్ధమునకే వత్తురను కొందు. అది మనకొక క్రీడామాత్రము. గూఢచారీ, ఎప్పుడు వారు బయలుదేరుదు రని చెప్పితివి ?

గూఢచారి : (లేచి, వినయుడై నమస్కరించి) ప్రభూ, నిన్న సేన బయలు దేరియుండును. అంతకుముందే కొన్నిసేనలు తరలినవని వింటిని. అనేకమార్గములుగా, అనేకసేనలు సంకేతస్థలమును జేరునట. కృష్ణయొద్దున సంకేత మేర్పరచుకొన్నారట.

తిరుమల : మహాప్రభూ! ఇది పెద్ద కుట్రగా తోచుచున్నది. నాబుద్ధి కిది పెద్ద యుద్ధముగా పరిణమించునట్లుతోచు చున్నది. బద్ధద్వేషులైన వారందరు కలియుట, రహస్యమార్గముల సేనలు పంపుట మొదలగున వన్నియు గమనింపదగిన యంశములే.

వేంకటాద్రి : ప్రభూ! నేనును పూర్తిగా తిరుమలరాయ సోదరులతో ఏకీభవించుచున్నాను. మీరును గట్టిగ సన్నాహములు చేయవలసిన తరుణము వచ్చినది.

రామరాయలు : తమ్ములారా! మీ రిరువురు సేనావృతులై బయలుదేరిపొండు. కృష్ణదాటి మహ్మదీయసేనలను ఈవలకు రానీయకుండ చూచుచుండుడు. రాచవీటి సేనతో మేము రేపు రాగలము. కాని ఇదియంతయు వట్టి హడావుడే యగునేమోయని తోచుచున్నది. ఈ సుల్తానులందరు మన శర ణందినవారేగదా! వీరితోడి యుద్ధయుకూడ ఒకయుద్ధమే!

తిరుమలరాయలు : (చేతులుజోడించి) ప్రభూ! ఒకమనవి.

రామరాయలు : ఏమది ?

తిరుమలరాయలు : ఈ నిండువయస్సులో మీరు యుద్ధమునకు రావలదని మా ప్రార్థన. మామూలుగా ఉపనిషత్తులను అధ్యయనముచేసికొనుచు, కవిపండితగోష్ఠి నెఱపుచు, తమరు కోటలోనేయుందురుగాక! అట్లు కాని నాడు మా భుజబలముపై తమకు విశ్వాసములేనట్లు భావించుకొనవలసివచ్చును.

వేంకటాద్రి : తమరు కోటలో నుంటమె మాకు పదివేలు.

రామరాయలు : తమ్ములారా! మీపై మా కవిశ్వాసమే? అట్టిది కలనైన తలంపకుడు. మీ సామర్థ్యములు నాకు బాగుగా తెలియును.

వేంకటాద్రి : మరి మీరేల విశ్రాంతి తీసికొనరాదు, ప్రభూ!

రామరాయలు : ఇంత వయస్సైననని. సామ్రాజ్యరక్షణకై జరిగిన యుద్ధములో నేను పాల్గొననిది లేదు. పాల్గొని వెన్నుచూపినదియు లేదు. అసలీయుద్ధము జరుగునను నమ్మకము నాకు లేనే లేదు. ఊరక వినోదము చూచుటకొఱకు రాగలను. ఇక మీరు అడ్డుచెప్ప వలదు.

వేంకటాద్రి : సుల్తానులందరు తమమైత్రిని సంబంధబాంధవ్యములచే దృఢతరము చేసికొన్నారని గూఢచారుల వలన తెలియవచ్చినది. తొందరపడవలయును. ఘోర యుద్ధమే జరుగున ట్లున్నది. తిరుమలరాయుడును, నేనును సముచితసేనలతో నీ దినముననేపోయి కృష్ణ

యావలిగట్టును రక్షించుచుండెదము. సెలవు.

రామరాయలు : సత్వరమేపొండు. అప్రమత్తులరై యుండుడు. అవసరములైన వార్తలున్నచో వెంటనే కబురంపుడు. విజయనగరముపై దండెత్తివచ్చుటకు సుల్తానులకు ధైర్యమెటనుండి వచ్చును? నమ్మజాలను, నమ్మజాలను.

## 2

నందిమాగధులు స్తోత్రించుచుండ రాయలు లేచెను. అంతఃపురమువైపు బయలుదేరి, రాజమాత సౌధమును ప్రవేశించెను. అదియొక రమణీయ విశాలమందిరము. రాజమాత నూఱువర్షములుదాటిన అతిమాత్ర వృద్ధురాలు. ఆరోగ్యము చెడకయే యుండెను. శాంతి, దరహాసము ఆమె వదనమున సదా తాండవించుచునే యుండును. నేడేలకో ఆమె ముఖమున కొలదిగా విషాదరేఖ యలముకొనిన ట్లున్నది.

ప్రతీహారిణులు రాయల యాగమనమును నివేదించిరి. రాయలు ప్రవేశించుటయే తడవుగా తల్లికి సాష్టాంగ నమస్కారము గావించెను. వృద్ధమాతయు దీవించెను. రాయలు "తల్లీ! రేపు యుద్ధభూమికి పోవుచున్నాను. ఎప్పటివాత్సల్యముతో ఆశీర్వదించి పంపుము" అనెను.

మాత : నాయనా! యుద్ధమెక్కడ? ఎవరితో?

రాయలు : తల్లీ ! కృష్ణాతీరమున, సుల్తానులతో.

మాత : ఇంత ఆకస్మికముగా యుద్ధమెట్లు తటస్థించినది ?

రాయలు : తల్లీ ! నమ్మజాలకున్నాను. అయినను, ఆ వినోద మేదో చూచివత్తును. సెలవిమ్ము.

మాత : (ఆలోచించుచుండును.)

రాయలు : తల్లీ ! ఏమి ?

మాత : (కంపితస్వరముతో) కన్నతండ్రీ! యుద్ధసన్నద్ధుడ వైన నిన్నెపుడును నేను వారింపనైతిని. అట్లుచేయుట అశుభముకూడను.

రాయలు : మఱి !

మాత : మఱి నిన్నిపుడు వారించుట నా విధియని తలంతును.

రాయలు : ఏమితల్లీ అట్లు పలుకుచుంటివి ?

మాత : తెల్లవారుజామున పీడకల వచ్చినది. అప్పటినుండి మనస్సు మనస్సులో లేదు. ఉదయము విప్రులకు పీడా పరిహారార్థము ఎల్ల దానములు చేసితిని. కాని మనస్సునకు ఇంతవరకు స్వస్థత చిక్కదయ్యె.

రాయలు : (తనలో) ఎన్నడు వారింపని తల్లి యిట్లు వారించుచున్నది. ఎన్నడు ఎదురుపలుకుట ఎఱుగని తమ్ములు యుద్ధమునకు రావద్దని, అట్లు ప్రార్థించిరి. మదీయ శరణార్థులును, ఆహవజితులును అగు సుల్తానులు అందరు ఏకమై యుద్ధమునకు వచ్చుచున్నారని గూఢ చారులు వార్తలు తెచ్చుచున్నారు. ఆహా ! ఇది

యంతయు నేమి?...(ప్రకాశముగా)...తల్లీ నాకే మియు ఫరవాలేదు. మీ యాశీర్వాదబలముచే ఇంత వఱకు అపజయమెట్టిదో యెఱుగను. తల్లీ! నిండు మనముతో దీవింపుము.

మాత: విజయశ్రీ సమన్వితుడవై (బాష్పములచే కంఠము రుద్ధమగును) ర...మ్ము.

రాయలు: (నమస్కరించి) తల్లీ! పోయివత్తును. సెలవు. అని పోవుచు "ఎవరురా, అక్కడ!"

భటుడు: చిత్తము, ప్రభూ!

రాయలు: వెంటనేపోయి దళవాయి వీరవెంకన్నను రమ్మని చెప్పుము.

భటుడు: చిత్తము ప్రభూ!

రాయలు భవనమును ప్రవేశించునంతలో వీర వెంకయ్య హజారముకడ వేచియుండును. రాయలు ఉచితా సనాసీనుడై వీర వెంకన్నను కూర్చుండు మనును.

రాయలు: వెంకన్నా! రాచవీటిసైన్యమును సిద్ధముగా నుంచుము, వేకువజామున నే ప్రయాణము. తెల్లవారు నప్పటికి కృష్ణానదితీరభూమిని చేరవలయును.

వీరవెంకన్న: చిత్తము ప్రభూ.

రాయలు: ఈ సుల్తానుల కింతధైర్యమెక్కడనుండి వచ్చినది? ఆశ్చర్యముగానున్నది వెంకన్నా!

వీరవెంకన్న: ప్రభూ! వారందరు ఏకమైనారట. దృఢ ప్రతి

జ్ఞలు తీసికొన్నారట. మైత్రిని పరస్పరసంబంధ బాధ వ్యములచే ధృఢతరముచేసికొన్నారట.

రాయలు : ఔను, అవన్నియు నిజమె.

వీర వెంకన్న : దూర దేశములనుండి తురుష్కుల సేనానులను రప్పించినారనియు వింటిని.

రాయలు : ఔను, అదియు నిజమె.

వీర వెంకన్న : వారందరుకలిసి, ఏదో గట్టి సన్నాహాముతే చేయుచున్నారు. ఇది ఏదో పెద్దవ్యూహము.

రాయలు : విజయనగర సామ్రాజ్య విధ్వంసనమె వారిసంకల్ప మేమో?

వీర వెంకన్న : పాపము శమించుగాక.

రాయలు : (ఇంచుక చలించి) వారి యుద్దేశ్యము కాదుగదా!

వీర వెంకన్న : వారందరు కలసినను మనకు సరిపోలగలరా, మహారాజా! ఏదోకొంత గడబిడచేసి కూతూహల మును తీర్చుకొందురేమో!

రాయలు : అవును. అంతియె. అంతకంటె ఏమిచేయగలరు? ఈ మారుమాత్రము వారందఱికి గట్టిగా బుద్ధిచెప్ప వలయును. నేను వచ్చునదియు అందుకే.

వీర వెంకన్న : మహారాజా! ఒక్కమనవి.

రాయలు : ఏమది?

వీర వెంకన్న : నేనొక్కడను చాలనా, ఈ మహమ్మదీయ సేనలను నామరూప రహితముచేయుటకు. నన్ను తమరు

విశ్వసింపజాలరా ప్రభూ!

రాయలు: ఇదేమి! వెంకన్నా! అసలు అట్టిఅనుమానమేల గలిగినది నీకు! నీవు నా యంగరక్షకుడవు. నీసేన నా యంగరక్షణసేన. అనేకయుద్ధములలో కంటికిరెప్పవలె కాపాడితివి. నీపైనను, నీసేనపైనను అనుమానమా!

వీరవెంకన్న: కాదుప్రభూ! కాదు. ఈ వయస్సులోమీరు యుద్ధమునకు రావలదు. యుద్ధభారమంతయు నాకును, మీ తమ్ములకును వదలివేయుడు. జయలక్ష్మిని తెచ్చి మీ పాదసమీపమున నుంచి, తలలువంచి, మ్రొక్క గలము.

రాయలు: నన్ను వారించుటలో నీ యుద్దేశమేమి? ఇది అపూర్వమే!

వీరవెంకన్న: నాదొక మనవి ఆలకింపుడు మహాప్రభూ! సుల్తానులందరు తమచే జయించబడి, పరాభవింపబడిన వారే. వారికీధైర్యము ఎక్కడనుండి వచ్చినదనిమీరు అనుకొనుచున్నారు? ఇది ధైర్యముకాదు. వారికిది చావు బ్రతుకులు తేల్చుకొను సమస్య. వారు తమ సర్వ స్వము నొడ్డి వచ్చుచున్నారు. మనము అప్రమత్తు లమై యుండవలయును. మీరు కోట రక్షించు చుండుడు. అదియె పదివేలు. మీరుమాత్రము యుద్ధ భూమికి రావలదని నామనవి. మీ వయస్సును మీరు గుర్తించుకొనవలయును. మీధైర్యసాహసములు జగ

ద్విదితములే గదా!

రాయలు : (ఆలోచనా నిమగ్నుడై) వెంకన్నా! నా వయస్సును అంతగా పాటింపకుము. ఇంతవఱకు దేహ, మనోదౌర్బల్యములన నేమియో నే నెఱుగను. ఇక నన్ను వారింపకుము. ఈ యుద్ధమునకు స్వయముగా నేను రావలసిన దే.

వీర వెంకన్న : చిత్తము ప్రభూ!

## 3

తెల్లవాఱుచుండెను. లేతసూర్యుని బంగారుకిరణములలో భూదేవి పసుపుతానములొనరించుచుండెను. వృక్షాగ్రములనుండి విహంగమ కూజితములు మనోహరముగ వినవచ్చుచుండెను.

రాచవీటిసైన్యపరివృతుడై రామరాయలు కృష్ణాతీరభూమిని చేరెను.

రామరాయలు : వీర వెంకన్నా! అటుచూడుము. ఈ ప్రాంతముల కృష్ణానదికి అదియొకటియె రేవుగదా! రేవును దాటి దిగువకు వచ్చు సైనికులు తురుష్కులు కారు గదా!

వీర వెంకన్న : ప్రభూ! అవి తురుష్కసేనలే.

(అంతలో గూఢచారులు ప్రవేశించి రాయలకు నమస్కరించి నిల్చుందురు.)

రామరాయలు : ఈ తురుష్క సేనలు రేవును ఎటుల దాట గల్గినవి? తిరుమలరాయ, వేంకటాద్రు లేమైరి?

గూఢచారి : ప్రభూ! మనసేనలు ముందుగా రేవును వశ పఱచికొని జాగరూకతతో సంరక్షించుచుండెను.

రామరాయలు : వెంకన్నా! అటుపొమ్ము. సేనల కలకలము జాస్తి అగుచున్నది. ముందుగా సేననంపి మహమ్మ దీయసేనావాహిని ముందుకురాకుండ అరికట్టుము.

(వీర వెంకన్న నిష్క్రమించును.)

ఇక మీ వార్తలేమి?

గూఢచారి : మహాప్రభూ! ఈ ప్రాంతముల ఇదియొకటియె రేవు. మనసేనలు దాని నాక్రమించికొనియుండె. మహమ్మదీయులెంత ప్రయత్నించినను రేవువారికి వశ పడదయ్యె. అంత వారు మఱియొక రేవును వెదకు టకు పోవువారివలె ఎగువకు పోవుచు నుండిరి. దిగువ తీరమందలి మన సేనలు వారి వెన్నంటి పోవుచు వేయికన్నుల కనిపెట్టియే యుండెను.

రామరాయలు : తరువాత.

గూఢచారి : అర్ధరాత్రమున తురుష్క సేనలు అకస్మాత్తుగా, నిశ్శబ్దముగా, రహస్యముగా దిగువకువచ్చి రేవును ఆక్రమించుకొనినవి.

రామరాయలు : మన సేనలు వెనుచిక్కినవన్న మాట. మహమ్మదీయుల మోసపు టెత్తు, మొదటనే ఫలించినదన్న మాట.

(వీర వెంకన్న ప్రవేశించును)

వీర వెంకన్న : ఔను! మొదటి ఎత్తు వారిదే ఫలించినది.

రామరాయలు : ఈ మైదానము యుద్ధమునకు సర్వవిధముల ననుకూలముగా నున్నది.

వీర వెంకన్న : ఔను ప్రభూ! ఇది విశాల రమణీయమైనది. ఇటు రక్షస అను గ్రామముగలదు. అటు తంగోడి అను గ్రామముగలదు. ఈ రెండు గ్రామములమధ్య ఈ మైదానము సమతలమై శోభించుచున్నది.

రామరాయలు : మంచిది. మనకు ఇదియె కురుక్షేత్రమగుగాక.

(తిరుమలరాయ, వేంకటాద్రులు ప్రవేశించి, నమస్కరించి)

తిరుమలరాయలు : అన్నా మహమ్మదీయసేన లిపుడె పారిపోవుచున్నవి.

వేంకటాద్రి: రాచవీటిసేనలు చేరుటతోడనే మొదటితాకిడికె వారిగుండెలు పగిలిపోయినవి.

(గూఢచారులు ఉద్వేగముగా వచ్చి నమస్కరింతురు.)

రామరాయలు : ఏమిటి విశేషములు?

గూఢచారి : మహాప్రభూ! పారిపోవు మహమ్మదీయసేన లన్నియు కాలు నిలువద్రొక్కకొన్నవి. వారిపుడు క్రొత్త వ్యూహము పన్నుచున్నారు. వారిసేనలన్నియు

నదిదాటిన ట్లు.

రామరాయలు : వారివ్యూహ రచన ఎట్లున్న దేమి ?

గూఢచారి : బీదరు, గోల్కొండనవాబులు ఒకప్రక్క మొనసియున్నారు. బీజాపూరు సుల్తాను సేనలు మఱియొకప్రక్కన మొనసియున్నవి. అహ్మదాబాదు సుల్తాను సేనలు మధ్య నెలకొని యున్నవి. హుస్సేన్ నిజాంషా అహమ్మదునగర సుల్తాను సర్వసేనాధిపతిగా నున్నాడు. అతని సలహాదారు చెలాబి రుమీఖాన్ అను విదేశీయుడు.

రామరాయలు : ఔను ! నాకును అతనిపేరు వినవచ్చినది. విదేశములనుండి అతనిని రప్పించినారట. నవీన యుద్ధ పద్ధతులలో ప్రవీణుడట. అది యటులుండనిండు.

గూఢచారి : అవును, మహాప్రభూ ! హుస్సేన్ నిజాంషా సైన్యమున రెండు మూడు వరుసలలో ఆరునూరు ఫిరంగులు బారులుతీర్చి నిలబెట్టబడియున్నవట. వాని ముందుభాగమున ఖురాసాన్ ఆశ్వికులు పదివేలమంది చేరియున్నారట.

రామరాయలు : గూఢచారులకు పసదనములిండు. (అప్పుడె, అచటనె ఇయ్యబడును.) సరే మీరుపోయి రహస్యములు కనిపెట్టుచుండుడు. (వారుపోవుదురు). తిరుమలా? ప్రతివ్యూహము పన్నుము. (ఆలోచించి) నేనేచెప్పెదను, వినుడు. తిరుమలా ! నీవు బీదరు, గోల్కొండ

సైన్యములను ఎదిరించుచుందుము. వేంకటాద్రి! నీవు బీజాపూరుసైన్యముల నెదుర్కొనుము. వీర వెంకన్నా! మనమిట నేయుండి సర్వసేనాధిపతి హుస్సేన్ నిజాంషా పని పట్టుదముగాక! చెలాబి రుమీఖాన్ సంగతి విచారింతముగాక!

తిరుమలరాయుడు: ప్రభూ! అన్నవు. అటుపై సామ్రాట్టువు. తండ్రివంటివాడవు. కావున పునరుక్తిభయము విడిచి మనవిచేసికొనుచున్నాను. నిజాంషాకు వీర వెంకన్న సరిపోవును. మీరు విశ్రాంతితీసికొనుచు, యుద్ధమును దర్శించుచు, మాకు సలహాలిండు. అది చాలును.

వేంకటాద్రి: అదియె నా యుద్దేశముకూడ. మా మనవి వినుడు.

రామరాయలు: వెంకన్నా! ఇంకను కదలవేమి? సోదరులారా! మీమీ స్థానములకుపొండు. ఇది కత్తిపని. మాటలపనిగాదు గదా!

వీర వెంకన్న: మహాప్రభూ! తమ్ములమనవి ఆలకింపుడు. నా ప్రార్థన మన్నింపుడు. తమరు విశ్రాంతి తీసికొనుడు.

రామరాయలు: ఇంకను జాగుచేయుచున్నారే! ఎవరిస్థానమునకు వారు వెంటనెపొండు. తమ్ములారా! గాభరా పడవలదు.

# 4

చెలాబి రుమీఖాన్ ప్రవేశించి, (తనలో) ఆహా! ఈ వృద్ధవీరుని తేజము అద్భుతముగానున్నదే! ఎంతమంది వీరులనో చూచితిమిగాని ఈతనివంటి శౌర్యమూర్తి నెందును కానను. నేను పన్నిన జటిలమైన వ్యూహరచన యంతయు ఒక్కత్రుటిలో వమ్ముచేసినాడీ వృద్ధవీరుడు. ఈ మహావీరుని వయస్సుచూచిన జాలివేయుచున్నది. శౌర్యముచూచిన ఈర్ష్యపుట్టుచున్నది. యుద్ధవిద్యయందు దారితేరిన సిద్ధహస్తులను పెక్కురను చూచినాడను. దేహబలమునందుగాని, మనోబలమునందుగాని ఈమహానీయునితో తులతూగువారి నెందును చూచి ఎరుగను. అగ్నికి వాయుదేవుడు తోడ్పడినట్లు ఈ వీరునకు ఈ రాచవీటిసేన ఎచ్చటదొరికినదో? ఈ సేనలోనివారు మనుజులో దనుజులో నాకు తెలియకున్నది. మా జటిలవ్యూహమును పటాపంచలు చేయుటయేగాక అరమైలుదూరము తరిమి తరిమి కొట్టినారు.

"ఈమారు గట్టివ్యూహరచనము చేయవలయును."
(ఆలోచించుచుండును)

భటుడు ప్రవేశించి "సర్కార్ హుస్సేన్ నిజాంషా వారు దయచేసియున్నారు."

చెలాబి రుమీఖాన్ : మంచిది. లోనికి తీసికొనిరమ్ము. ఇదిగో నేనును వచ్చుచున్నాను (ఎదురుపోవును).

హుస్సేన్ నిజాంషా : ఏమి రుమీఖాన్! అనవసరముగా మన

సేనలు వెన్నిచ్చి పారిపోయినవిగదా! ఈ నాస్తిక సేనకు ఇట్టిశౌర్య మెటనుండి వచ్చినదో తోచుట లేదు.

చెలాబి రుమీఖాన్ : ఇరువైపులనున్న రంగరాయ, వేంకట్రాదులకు మన గోల్కొండ, బీజాపూరు సేనలు బొత్తిగా చాలకున్నవి. యుద్ధము మొదలిడగనె వారు వెన్నిచ్చి పారిపోవుట, శత్రుసేనలు తరిమికొట్టుటయా? ఈ స్థితి మిక్కిలి ప్రమాదకరము. మఱియొక మారు ఇట్లు జరుగుచో సుల్తానులందఱిని ఏకముఖమునకు తెచ్చి, రాయల సేనలు ఓడించుట నిశ్చయము. ఆ పరాభవము సామాన్యముకాదు. సర్వనాశము తెచ్చును. అది తలచుకొన్నంతనే నా దేహము గగుర్పొడుచుచున్నది.

హుస్సేన్ నిజాంషా : ఔను, ఇప్పటి పరిస్థితులలో మన కేమియు ఆశ యగపడుటలేదు. ఏమిచేయవలయునో తోచకున్నది. ఈ సంయుక్త మహమ్మదీయ సేనలోడిపోవుటతో దక్షిణ హిందూ స్థానమున మనకు పుట్టుగతులుండవు. రుమీఖాన్! యుద్ధఫలిత మంతయు నీ చేతులలోనున్నది. ఏమి చేయుదువో! ఎట్టి వ్యూహము పన్నెదవో!

చెలాబి రుమీఖాన్ : నా చేతనైనంతవరకు వ్యూహరచనలో లోపముచేయను. సరియైన ఆచరణము లేనిచో కేవల

వ్యూహరచనము మనలనీ యాపదనుండి రక్షింపజాల దనుకొందును.

హుస్సేన్ నిజాంషా: సేనలను పురికొల్పుదును. పసదనము లిత్తును. ఇదిగో నా ప్రతిజ్ఞ వినుము. శత్రుసేనల నోడించు పర్యంతము ఎక్కిన గుఱ్ఱమునుండి దిగను. మద్యపానము సేయను.

చెలాబి రుమీఖాన్: శహబాస్! అల్లాహో అక్బర్. సర్కార్, మీరు కేవలము మానవమాత్రులుగారు.

భటుడు: (ప్రవేశించి) గోల్కొండ, బీజాపూరు సుల్తానులు అరుదెంచుచున్నారు.

హుస్సేన్ నిజాంషా: త్వరగా ప్రవేశపెట్టుము.

ఇరువురు సుల్తానులు అరుదెంచి, తలలువాల్చి నిల్చొందురు.

హుస్సేన్ నిజాంషా: జరిగినదేమో జరిగినది. ఇక మనము గట్టి ప్రయత్నములు చేయవలయును. లేనిచో సర్వ నాశనము తప్పదు.

చెలాబి రుమీఖాన్: మన కందఱకు హుస్సేన్ నిజాంషా ఆదర్శముగా నుండుగాక! వారు తీసికొన్న ప్రతిజ్ఞ అమోఘమై జయము మనకు గల్గించుగాక!

గోల్కొండ సుల్తాను: ఏమి ప్రతిజ్ఞ!

చెలాబి రుమీఖాన్: (వారలకు సత్వరము వినిపించి) ఇక మనము ఎంత ఆపదలువచ్చినను వెనుదీయరాదు.

పారిపోవు సేనలను ఉత్సాహపూరితములను చేయ వలయును. పసదనములు, బహుమతులు మొదలగు వానిచే సేనలను ఉత్సాహపరిపూరితములను జేయ వలయును.

బీజాపూరు సుల్తాను: మంచిది. ఇదిగో మేమును ప్రతిజ్ఞ చేయుచున్నారము. (అని అట్లె యొనర్చును.)

అపుడు బీజాపూరు సుల్తాను, హుస్సేన్ నిజాంషా మొదలగువారి నుద్దేశించి, 'సుల్తానులారా! నాదొక మనవి. యుద్ధప్రారంభముననే చాల గట్టిదెబ్బలు తిన్నారము. దీని వలన మనసేనల యశక్తి, రాయలసేనల విశిష్టత స్పష్టముగా గోచరించుచున్నది. అదేమియు నాకు సరిగా లేదు. మనసేనల లోని శవరాసులకు అంతులేదు. వానిని చూచినకొలది దుఃఖము పొంగి పొరలివచ్చుచున్నది. ఇపుడు మనము తీసి కొనిన ప్రతిజ్ఞలు మంచివే. మన ధైర్యస్థైర్యములను అవి చాటగలవు. ఇంతకంటెను ఫలకారియగు ఉపాయమును అవలంబింపవలయును. మన జయము నిస్సంశయము చేసికొనవలెను.' అని పలికెను.

చెలాబి రుమీఖాన్: కావున ఇపుడేమి చేయవలయునని మీ యూహ?

బీజాపూరు సుల్తాను: మిత్రభేద తంత్రము.

హుస్సేన్ నిజాంషా: అది సాధ్యమా?

బీజాపూరు సుల్తాను : తప్పక సాధ్యమగునని నా యూహ.

హుస్సేన్ నిజాంషా : వివరించి తెల్పుము.

బీజాపూరు సుల్తాను : రామరాయల సేనలో తొంబదివేల సేనకు అధిపతిగా అయినుల్ ముల్కు అను మహ్మాదీయ సేనాపతి యొకడు గలడు. రాయలు అతనిని 'భాయీ' అని పిల్చి గౌరవించుచుండును. సరిగ అట్టి సేనానియే మఱియొకడు రాయల సేనలయందు గలడు. అతడు సర్వ విషయములయందును అయినుల్ ముల్కును అనుసరించుచుండును.

హుస్సేన్ నిజాంషా : వారిరువురు రాయల సేనలో చేరుటకు నిమిత్తమేమి ?

బీజాపూరు సుల్తాను : మా పితృపాదులు, అయినుల్ ముల్కు తండ్రిని రాజద్రోహమునకై చంపించినారు. అప్పటి నుండియు అతడు రాయల నాశ్రయించియున్నాడు. రెండవ సేనానియు వానిబంధువగుటచే లేచివచ్చి రాయలకొలువులో కుదిరినాడు.

హుస్సేన్ నిజాంషా : అట్టివారు మిత్రభేద తంత్రమునకు వశ పడుదురా ?

బీజాపూరు సుల్తాను : తప్పక వశపడుదురు. వారుమాత్రము మహ్మాదీయులుగారా ? నాస్తికులను గొల్చియుండుట వారికిమాత్రము ఇష్టమా ?

హుస్సేన్ నిజాంషా : ఈ సందర్భమున జరగవలసిన పని

యంతయు మీరే స్వయముగా, శీఘ్రముగా విచారించుచుండుడు.

బీజాపూరు సుల్తాను : అట్లె. అదియంతయు నాకు వదలివేయుడు. మనతంత్రము ఫలించినచో మనమందఱము వారిరువురకు పెక్కుజాగీరులు ఈవలసి యుండును.

హుస్సేన్ నిజాంషా : అందులకేమియు కొదువ యుండదు. మన తంత్రము సిద్ధింపవలయునేగాని వారిరువురిని సామంతులనే చేయుదముగాక. ప్రస్తుతము మన బలములనే మనము నమ్మియుంచుట మంచిది.

చెలాబి రుమీఖాన్ : మంచిది. చెదరిన సేనలన్నింటిని సమకూర్చుకొని, మనసేనల యిరుపక్షముల మొనసి యుండవలసినదని సేనానాయకుల కాజ్ఞాపింపుడు. మఱి యొక ప్రయత్నము చేయుదముగాక! సుల్తానులందరు తమతమ ప్రతిజ్ఞలు మఱువకుందురుగాక. జాగుచేసినచో శత్రుసేనలె వచ్చి ఒక్కుమ్మడిగా మనపై బడగలవు. అపుడు సర్వనాశనమె జరుగగలదు. ఈ సంగతి మాత్రము మఱువవలదు.

## 5

రామరాయలు : ఏమి ఈచిటపటధ్వనులేమి? (ముందుకుపోయి, ఆకాశమునైపు చూచి) అంతయు చిటపట శబ్ద

మయము. (ముందుకుచూచి) ఈ విపరీత మేమిటి?మదీయ సేనాగ్రభాగమంతయు చెక్కుచెదరి వెన్నుచూపు చున్న దేల?

వీర వెంకన్న : (ప్రవేశించి) మహాప్రభూ! నమస్కారము. (ఉద్వేగముతో) శత్రువులు మంచి వ్యూహము పన్ని నారు. రాగినాణెములుంచిన ఫిరంగులను సేనల వెనుక భాగముననుంచి వానిముందు ఖురాసాన్ ఆశ్విక సేనను పదివేలకు మించినదానిని ఉంచినారు. మన సేనలు సమీపింపగనే ఫిరంగులను పేల్చినారు. ఆ దెబ్బచే మన సేనలు గట్టిదెబ్బతిన్నవి. తెలియని దెబ్బయగుటచే మన సేనలు మిక్కిలికలవరము చెంది, వెన్నుచూపుచున్నవి.

రామరాయలు : ఆ విపరీతధ్వను లేమి?

వీర వెంకన్న : అవి విజయధ్వనులు మహాప్రభూ!

రామరాయలు : ఎవరివి?

వీర వెంకన్న : అహమ్మద్ నగర సుల్తాను భటులుచేయు విజయధ్వనులవి. ఈ స్వల్పవిజయమున కలరి వారంతగా పరవశులై జయధ్వానములు చేయుచున్నారు.

రామరాయలు : (ఇంకను ముందుభాగమున కేగి, వెన్నిచ్చి పారివచ్చు సేనలకు ఉత్సాహమిచ్చి) భటులారా! వెన్నుచూపిన ప్రయోజనములేదు. ఎప్పటికైన చావు తప్పదు. ఎవరిస్థానమునవారు నిలబడియుండుడు.

సైనికులందఱు రామరాయల దర్శనముచే ఉత్తే

జితులై ఎవరిస్థానమున వారు నిలబడి యుందురు.

వీరవెంకన్న : సెబాస్, భటులారా! సెబాస్.

రామరాయలు : శత్రుసేనాముఖమున ఆ కోలాహలమేమి?

వీరవెంకన్న : అహమ్మద్ నగరసుల్తాను మనసేనల ఎట్ట యెదట తన శిబిరమును నెలకొల్పెను. దానికి శృంగార మంటప మని పేరిడెను. అందుండి అతడు తన భటులకు పసదనము లిచ్చుచున్నాడు.

రామరాయలు : ఓ, అట్లా! మంచిది (తనపరివారము నుద్దేశించి) హుస్సేన్ నిజాంషా సేనల కెట్టెదుట మా సింహాసనమునుంచి విజయ మంటపము రచింపుడు. వెంటనే!

అప్పుడు పరివారము మంచి ముత్యపు జాలరులు చుట్టును వ్రేలగట్టి, బంగారు నగిషీతో అలంకరింపబడిన విచిత్రవితానము క్రిందగల మంటపమున సింహాసనము నుంచెను. సమీపమునగల వేదికపై బంగారు వరహాలు, ముత్యాల హారములు, స్వర్ణభూషణములు కుప్పతిప్పలుగా పోసియుండును.

రామరాయలు: (సింహాసన మధిష్ఠించి) వీరవరులారా! రండు. ఈ దినమున మీరు ప్రకటించిన శౌర్యము అద్భుతము. చాటు ఫిరంగిదెబ్బలను లక్ష్యపెట్టక అనతి కాలముననే స్వస్థానమున నిల్చియున్న మీ స్థైర్యము మాకు గర్వకారణమగుచున్నది.

సేనయందలి భటులందఱు ఒక్కమాఱు సాగర గంభీరధ్వనులతో, విజయధ్యానము లొనరించి యుద్ధోన్ముఖులగుదురు. యుద్ధము ముమ్మరముగా సాగుచుండును. రాయలు సింహాసనమునుండియే కొంతవడి యుద్ధగతి పరిశీలించుచుండును. అప్పటికప్పుడే మహావీరులకు, ప్రకటించిన శౌర్యమునకు అనుగుణములైన పసదనము లర్పించుచుండును. పోరు ఘోరముకాగా రాయలు పంచకళ్యాణిగుఱ్ఱము నధిరోహించి, సేనాగ్రభాగమునకు జని, సైనికులను ఉత్సాహవంతులను జేయుచు మహావీరులను, అప్పుడె, అక్కడె బహూకరించుచుండెను. వికలాంగులను చికిత్సాశాలకు పంపుచు ఓదార్చుచుండెను. వీర సుందరమూర్తియైన రాయలనుజూచి సేనలన్నియు ఒక్కపరి ఉత్సాహసంభరితములై "హరహర మహాదేవ్," "శ్రీవిరూపాక్షస్వామికిజయ్," "శ్రీరామరాయసార్వభౌములకుజయ్" అను నాదములు మిన్నుముట్ట ముందుకు సాగుచుండెను. సమరము సంకులమయ్యెను. హుస్సేన్‌నిజాంషా స్వయముగా సేనల నుత్సాహపఱచుచుండెను. జాముసేపటిలోనే యుద్ధగతి తెల్లమగుచుండెను. మహమ్మదీయ సేనలు వెనుతిరిగి పోవుచుండెను. రాయలసేనలు మహోత్సాహముతో ముందుకు నెట్టుకొనిపోవుచుండెను. తుదికి మహమ్మదీయసేనలు చెల్లాచెదరై వెన్నుచూపెను.

రామరాయలు మహోత్సాహముతో విజయమంటపమునుచేరెను. కొలదిసేపటిలో వేంకటాద్రి, తిరుమలరాయలు,

వీరవెంకన్న ప్రవేశింతురు. పరస్పరాభి వందనములు చేసి కొందురు.

వీరవెంకన్న : ప్రభూ! ఇది సంపూర్ణవిజయము. శాత్రవులింత త్వరలో లొంగిపోవుదురని ఎన్నడును భావింపలేదు.

వేంకటాద్రి : చెలాబి రుమీఖాన్ తెలివైనవాడు. అతని వ్యూహరచన మిక్కిలి పటిష్ఠమైనది. సేనలలో కట్టుబాటు తక్కువయగుటచే మాటిమాటికి వెన్నుచూపు చున్నవి.(అని చేతిగాయములు తడువుకొనుచుండును.)

రామరాయలు : (ఆతురతతో) తమ్ముడా! తిరుమలా! ఈ విజయసంతోషమును డిందుపఱచు దుర్వార్తలు పెక్కులు వింటిని. ఏమిచేయగలము? అభినవాభిమన్యుడగు పుత్రుడు రఘునాధరాయలను కోల్పోతిమిగదా! హాతవిధీ! ఎంతదుర్వార్త వినవలసివచ్చెను? ఈ నష్టము పూర్తియగుట ఎట్లు ?

తిరుమలరాయలు : (కన్నీటితో) సామ్రాజ్యసంరక్షణార్థము ఇట్టిత్యాగములు చేయుట విధిగదా! ఇందులకు చింతింప బనియేమి? యుద్ధరంగమున యోధాను యోధులను పెక్కురను వధించి వీరస్వర్గము నలంకరించిన పుత్రుడు తండ్రికి గర్వస్థానమెగదా!

రామరాయలు : తమ్ముడూ! ఏదీ! తలయెత్తుము. నీకంటికి దెబ్బ తగిలినదనియు వింటిని.

తిరుమలరాయలు : (తలయెత్తకయె) ప్రభూ! మీరుచూడ

దగిన పెద్దదెబ్బయేమియు లేదు. ఇప్పుడు నాకా బాధ ఇసుమంతయు లేదు.

వేంకటాద్రి : ప్రభూ! మీ తమ్మునికన్ను పూర్తిగాపోయినది.

రామరాయలు : హతవిధీ! ఎంతపని జరిగినది? వేంకటాద్రి! నీకాయము గాయములమయమైవంతకూర్చుచున్నది. ఈ గాయములచేతనే నీకీర్తి యథేచ్ఛావిహార మొనరించుచున్నది. బీజాపూరుసుల్తానును ముప్పతిప్పలు పెట్టి, నిలువ నీడ లేకుండ జేసిన నీ పరాక్రమ యశోగానమె నేడు సర్వత్ర విననయ్యె. గాయములకు కట్టుగట్టించుకొని విశ్రాంతి తీసికొనుచుండుము. మిమ్ములను జూచినకొలది నామనస్సు ద్రవించి పోవుచున్నది. వీరవెంకన్నా! నేటి నీ పరాక్రమము దేవతలు చూడదగినది. వృద్ధుడనైన నా భారము, నా బాధ్యత నీవేవహించి ద్విగుణీకృతోత్సాహముతో, సవ్యసాచివలె, పోరొనరించితివి. నీకాయము నిండను గాయములే. పోయి మీరందరు విశ్రాంతి తీసికొనుడు. కొంతవఱకు యుద్ధగతులను నాపై నుంచుడు.

వీరవెంకన్న : వలదుప్రభూ! వలదు. మాకెట్టి ఆయాసమును లేదు. బాధయులేదు. యుద్ధము మఱల చెలరేగు సూచనలు కానవచ్చుచున్నవి. అసలు మీరు సేనాగ్రభాగమునకు రావలదు. మామనవి ఆలకింపుడు. ఈతడవ

ఏ ధైర్యముతో యుద్ధమొనర్ప మహమ్మదీయులు మొగ్గు చున్నారో తెలియకున్నది. ఇందేదో గొప్పరహస్య మిమిడియుండును. మీరుమాత్రము అప్రమత్తులరై యుండుడు.

రామరాయలు : తిరుమలరాయా! వేంకటాద్రీ! మిమువంటి తమ్ములను గల్గియున్నందులకు మిక్కిలి గర్వించు చున్నాను. వీరవెంకన్నా! నీసేవ లెన్నటికి మఱువ జాలను. నేటి యీ సంపూర్ణవిజయము మీముగ్గురిదే.

తిరుమలరాయలు : అట్లుగాదుప్రభూ! మీ సన్నిధాన ప్రభా వము సేనలను అమితోత్సాహులను జేయుచున్నది. అందువలననే విజయలక్ష్మి మీపాదసన్నిధి వీడకున్నది.

రామరాయలు : ఆహా! సామ్రాజ్యభారమెంత దుస్సహము! సోదరులను, మిత్రులను ఇట్లు వగలపాలుచేసి స్వార్థ చిత్తుడనై సామ్రాజ్యము పాలించుచుంటినా? ఇట్టి సామ్రాజ్యమున్ననేమి? ఊడిననేమి?

వీరవెంకన్న : ప్రభూ! ఇదేమి? అమంగళ ముపశమించుగాక.

రామరాయలు : ఇందేమిగలదు? కష్టపడి వేయిసామ్రాజ్య ములనైనను సంపాదించుకొననగును. కాని మిము వంటి సోదరులను, మిత్రులను సంపాదించుకొనుట సాధ్యపడు విషయమే! వెంకన్నా! చూడుము. ఇట్టి సంపూర్ణవిజయమువలనను మనస్సునకు స్వస్థత చిక్క కున్నది.

తిరుమలరాయలు: సంయోగ వియోగములు దైవాధీనములు. విధి నిర్వహణము మాత్రమె మన కర్తవ్యము.

వేంకటాద్రి : ప్రభూ! ఏల విచారము! స్వార్థపరత్వముచే ఈ సామ్రాజ్యమును మనము నిర్వహించుటలేదు. ఈ సామ్రాజ్యము శ్రీ విరూపాక్షస్వామివారిది. వారి ప్రతినిధులుగా మాత్రమె మనము ఈ బాధ్యతాభారములను వహించుచున్నారము. ఆ మహాదేవుని కరుణా కటాక్షపాత్రులమై యున్నంతవఱకు, వ్యక్తిగతములైన కష్టనష్టములు మనకు అలక్ష్యములు.

వీరవెంకన్న : మహాప్రభూ! సర్వజ్ఞులైన మీరిట్లు నేడు విచారపూరితులై యుండుట మా దురదృష్టము. ఓటమి యెఱుగని శ్రీకృష్ణదేవరాయల తేజోమూర్తి మిమ్ములను స్వస్థచిత్తులను జేయుగాక. యుద్ధ మన పూర్వుల పాన్పు గాదు గదా? రఘునాథరాయలు వీరాభిమన్యుడె. అయిన నేమి చేయగలము? విధివిధాన మప్రతిహతము.

తిరుమలరాయలు : మహాప్రభూ! స్వార్థపరత్వముచే మనము సామ్రాజ్యమును వహించుటలేదు. దక్షిణహిందూస్థానమందలి హిందూధర్మరక్షణము ఆంధ్రులమైన మన పాలబడినది. ఒరుగల్లు సామ్రాజ్యకాలమునుండియు ఆంధ్రులు ఈ మహాకార్య భారమును అప్రమత్తతతో నిర్వహించుచున్నారు. ఈనాడు మనమది

స్వార్థపరత్వమనుట మనలను మనము వంచించు కొనుటయెగదా!

రామరాయలు: సోదరులారా! విధ్యుక్తధర్మమును చక్కగా జ్ఞప్తి కెలయించినారరు. ఇక నాకెట్టి విచారమును లేదు. ప్రేమైకనిధి రఘునాధరాయ పుత్ర మరణమును దిగ మింగుచున్నాను. మిమువంటి మిత్ర, సోదరులను చూచుకొని గర్వించుచున్నాను. హిందూధర్మసంరక్షణమె మనవిధి; మన యాదర్శము. శ్రీ విరూపాక్ష దేవులవారి కరుణాకటాక్ష వీక్షణములకు పాత్రమగునట్లుగా, ఒరంగల్లు మహాసామ్రాజ్య దివ్యసంకల్పము నెఱవేఱునట్లుగా, విద్యారణ్యస్వాములవారి దృఢ నిశ్చయము సార్థకమగునట్లుగా, శ్రీకృష్ణదేవరాయలచే ప్రారంభింపబడిన పవిత్రయుద్ధ యజ్ఞము సాంతమగునట్లుగా, ఈ విశాలాంధ్ర మహాప్రజల మహాబాధ్యతను నా భుజదండముల వహించి కృతకృత్యుడ నయ్యెదనుగాక. ఈ విధి నిర్వహణమున ప్రాణములు సయితము తృణప్రాయములుగా నర్పింతముగాక. లెండు; సోదరులారా! లెండు; మన మహాసేనలను పురికొల్పుడు.

వీరవెంకన్న: శ్రీరాయలవారికి జయమగుగాక.

రామరాయలు: వీరవెంకన్నా! మరచితిని. ఈవిజయవార్తను విజయనగరమందలి వృద్ధమాతకు నివేదింప భటులను

బంపుము. పూజ్యురాలగు తల్లిగారు ఆందోళన పడుచుందురేమో !

వీర వెంకన్న : చిత్తము. అనుగ్రహింపబడితిని.

తిరుమలరాయలు: మహమ్మదీయులు ఇంత యోటమితరువాత మరల యుద్ధసన్నద్ధులగుచుండుట ఆశ్చర్యముగా నున్నది.

వేంకటాద్రి : యుద్ధసంసిద్ధములై యున్నవి మహమ్మదీయ సేనలు. యథాపూర్వ వ్యూహరచనమే.

వీర వెంకన్న : ప్రభూ! మన సైనికులు ఆందోళన చెందుచున్నారు. అయినుల్‌ముల్కు సేనాధిపతి శిబిరమున కెవరో వచ్చుచు, పోవుచు నున్నారని అనుమానముగానున్నది. యుద్ధపు తొందరలలో సంగతి గమనింపలేకపోయితిని.

రామరాయలు : వెంకన్నా! నీవు చెప్పునది నిరాధారమనుటకు వీలులేదు. గూఢచారులవార్తలు నీయనుమానమును బలపఱచుచున్నవి. అయినుల్ ముల్కు రాజద్రోహము చేయగలడని విశ్వసింపలేక గూఢచారులను లెక్కింపనైతిని. ఈ స్థితిలో మనలను వంచించి ఆతండు బావుకొనునది యేమి? మనమాతనికిచ్చిన యాశ్రయము అతడెప్పుడును మఱచిపోలేడని నావిశ్వాసము. రెండుమూడు యుద్ధములలో అతడు చూపిన రాజభక్తి అమోఘము. పైగా, అతనిపై నాకు

ప్రత్యేకాభిమానము గలదు. "భాయీ" యని అతనిని సంబోధించుచుండును. కేవలము మతోన్మాదముచే మనుజుడు దనుజుడు కాగలడని విశ్వసింపలేకున్నాను.

రంగరాయలు: ఇది మహమ్మదీయులకు చావుబ్రతుకుల సమస్య. ఇట్టి క్లిష్టసమయములో ఎవరేమి చేయుదురో చెప్పలేము. అయినుల్ ముల్కు విషయమున నాకెట్టి సంశయము లేదు. అయినను అన్నగారు మిక్కిలి జాగరూకులై యుండుట మంచిది. లేనిచో ఇప్పటి విజయగర్వము త్రుటిలో సర్వనాశనకరము కాగలదు.

వేంకటాద్రి: అయినుల్ ముల్కు నాతో గలసిమెలసి మహమ్మదీయులపై దండయాత్రలు నెఱపినాడు. అతని మానసము విశుద్ధము, వినిర్మలము అని నా యుద్దేశ్యము. అయ్యో మనమతని నొకకంట గనిపెట్టియుందుముగాక.

వీరవెంకన్న: ప్రభూ! ఎవరేమి చెప్పినను నామనసు మాత్రము ఏలకో ఆందోళన చెందుచున్నది. అయినుల్ ముల్కు మీా విశ్వాసము చూరగొనినాడు. నాకతని జూచినంతనే సంశయము గల్గుచున్నది.

రామరాయలు: వెంకన్నా! ఏమియు ఫరవా లేదు. అయినను ప్రమత్తులమై యుండజనదు.

వీర వెంకన్న : ప్రభూ! ఈ సేవకునకు ఒక్క వరమీయవలయును. మీ రనేకపర్యాయములు వరము స్వీకరింపుమని తొందర పెట్టితిరి. ఇంతవరకు ఎపుడును కోరుకొనలేదు. ప్రభూ! నేడు కోరుకొనుచున్నాను. ఇంతవరకు చను వీయవలెను.

రామరాయలు : వెంకన్నా! ఏమి నీ వెఱ్ఱి! నీవరము తీర్చుట మావిధి.

వీర వెంకన్న : ప్రభూ! మీరు విజయమంటపమునందే యుండి యుద్ధగతిని గమనించుచుండుడు. సేనాగ్రభాగమునకు రావలదు. మెఱియలవంటి రాచవీటిభటులను తమకు అంగరక్షకులుగా తమయొద్దనే యుంతును. ఇందులకు తమ రంగీకరింపవలయును.

వేంకటాద్రి : అన్నా! ఇట్లుచేయుట మిక్కిలి మంచిది. మాపై అనుగ్రహించి ఇందులకు అంగీకరింతురు గాక.

రామరాయలు : మీరందరు వెఱ్ఱివాండ్రై పోవుచున్నారు. నేను అప్రమత్తుడనై యుండెదను. యుద్ధభూములకు పొండు. అవిగో మహమ్మదీయ సేనలు ముందునకు త్రోసికొని వచ్చుచున్నవి. జాగుచేయుటకు ఎంత మాత్రము ఎడములేదు.

(అందరు నిష్క్రమింతురు.)

శృంగారమంటపమున హుస్సేన్ నిజాంషా, రుమీఖాన్, కిస్వరీ ఖాన్, కమలుదీన్ కూర్చుండియుందురు.

చెలాబి రుమీఖాన్ : కిస్వరీ ఖాన్, ముస్తాఫాఖాన్! మీరిరువురు అతిజాగరూకతతో ప్రవర్తింపవలయును. లేనిచో మనస్థితి అధ్వాన్నమే.

కిస్వరీఖాన్ : అట్లే!

చెలాబి రుమీఖాన్ : సంకేతము గుర్తు గలదు గదా!

కమలుదీన్ : ఆఁ, అది మరచిపోవుదుమా!

చెలాబి రుమీఖాన్ : మఱల నొకమారు చెప్పుచున్నాను. అయినుల్ముల్కు ఖడ్గహస్తమును పైకెత్తును. అదియె సంకేతము. అపుడు మీరిరువురు మీమీ సేనలతో మీమీ స్థానములు వదలి మధ్యభాగమునగల రాయల సేనలమీదికి దూకవలయును.

కిస్వరీ ఖాన్ : తప్పక అట్లేచేయుదుము. మాకు మీరు అంతగా చెప్పవలయునా!

చెలాబి రుమీఖాన్ : సోదరులారా! మీకు తెలియదని కాదు. నేటి రెండుయుద్ధములలో మనమే ఓడిపోయితిమి. ఫిరంగియుద్ధమున ఒక త్రుటికాలము మాత్రము వారి సేనలను చీకాకు పఱచితిమి. అంతియె. అదియొక విజయముగా లెక్కింపదగినదికాదు. మఱునిముష ములో వారు తేరుకొనినారు. సంపూర్ణ విజయమును

పొందినారు.

కిస్వరీఖాన్ : అవును. అవన్నియు మాకు తెలియదా, రుమీాఖాన్ ?

చెలాబి రుమీాఖాన్ : ఆ మహాపరాజయానంతరము మిత్రభేద తంత్ర విజయగర్వము మనలను కాలు నిలువద్రొక్కుకొన జేసినది. దైవముపై భారము వేసి ఈ మూడవ యుద్ధమునకు సన్నద్ధుల మగుచున్నారము.

కమలుదీన్ : తెలియును. మాకు బాగుగా తెలియును. అది యునుగాక యింతవరకు జరిగిన అపజయములలో మా అశ్రద్ధయు, మా పలాయనము చాలవఱకు కారణములు. ఆ విషయము మేమును అంగీకరించుచునే యున్నారము. సైన్యము అట్టిది. మంచి తరిఫీదు నందలేదు.

హుస్సేన్ నిజాంషా: గతించినవానిని తడవుకొనవలదు. ముందు దానికి జాగ్రత్తపడుదురుగాక. రుమీాఖాన్ చెప్పునది జాగ్రత్తగా వినుడు. శ్రద్ధతో ఆచరణమునందు పెట్టుదురు గాక.

చెలాబి రుమీాఖాన్ : జాగ్రత్తగా వినుడు. ఒక్కపొరపాటు ఈ సమయమున సర్వనాశనము చేయగలదు. అయినుల్ ముల్కు ఖడ్గహస్తమును పైకెత్తుట తోడనే మీారిరువురు యాశ్వికసేనలతో రామరాయల సేనలలో ప్రవేశించుడు. అయినుల్ ముల్కు ఖడ్గ

హస్తము పైకెత్తునప్పటికే అతనిసేనలు, అతని బంధుసేనలును, రాయలసేనలపై పితూరి ప్రారంభింప గలవు. అంతటితో రాయలసేనలలో కల్లోలము బయలు దేరగలదు. సరిగ ఆ సమయముననే మీరిరువురు మీ ఆశ్వికసేనతో, వెనుకముందులు చూడకుండ, రాయల సేనలోకి దూకవలయును. అసలే చెదరిపోయి యున్న రాయలసేనల క్రమము, మీరు ప్రవేశించుటతో, విచ్ఛిన్నమై పోగలదు. రామరాయల సేనలో పూర్తిగా సంక్షోభము గలుగు సమయమున నేను ఖురాసాన్ ఆశ్వికదళముతో రాయల సేనలో ప్రవేశింతును.

కిస్వరీఖాన్ : రుమీఖాన్, నీవు చెప్పినట్లు చేసెదము. ఈ యుద్ధములో మహమ్మదీయులు పొందిన నష్టము మాకు మాత్రము ఒడలు మండించుట లేదా! ప్రతీకారేచ్ఛ మాకుమాత్రము లేదా! నీవు పన్నిన ఈ దుర్భేద్య వ్యూహము ఈ తడవ జయలక్ష్మిని మనస్వాధీనము చేసి తీరును.

హుస్సేన్ నిజాంషా : ఏమో! అల్లాదయ యెట్లున్నదో? ఈ వ్యూహముకూడ జయము నొందింపగలదని తోచుట లేదు. రామరాయలను పట్టుకొనుట దుస్సాధ్యము. కాదుఅసాధ్యముగూడను. అతని అంగరక్షక సైన్యము రాచవీటి సైన్యములోని భటులు. ఉక్కుతునకలు,

వారు మనుజులుగారు, దనుజులే. వారి సేనానాయకుడు ధైర్యావతారమే.

చెలాబి రుమీఖాన్ : సేనాపతులారా! మీరు మీవిధి నిర్వహింపుడు. తర్వాత ఖురాసాన్ ఆశ్వికసైన్యముతో నేనేమి చేయుదునో మీరే తెలిసికొందురుగాక. ఈ వ్యూహముస లక్ష్యమంతయు రామరాయల నిర్బంధము. అది సాధ్యపడనిచో చిక్కినచోట చిక్కినట్లుగా అతనిని సంహరింపుడు. ఇదిమాత్రము గట్టిగాగుర్తుంచుకొనవలయును. ఈ వ్యూహము జయప్రదముగానిచో మనకు దక్షిణాపథమున పుట్టగతు లుండవు.

హుస్సేన్ నిజాంషా : రూమీఖాన్! రాచవీటిసేనలో చాల భాగము రాయలకు అంగరక్షముగా నుంచి రాయల నొకచో పదిలపఱతురని తెలిసినది.

చెలాబి రుమీఖాన్ : అది నాకును తెలియును. అది మనకును అనుకూలమె. రాయలు యుద్ధోన్మాది. వీర రసపూరితుడు. అతడు సేనాగ్రభాగమునకు రాకుండ నుండజాలడు. ఆ వీరమూర్తి దర్శనముచేతనే సేనాసాగరము లుప్పొంగును. ఆతడు సేనాగ్రభాగమునకు స్వభావసిద్ధముగా వచ్చియె తీరును. సేనలను పురికొల్పకుండ నతడుండజాలడు. రాచవీటిసేనలో చాల భాగము నిష్క్రియమై వెనుకభాగమున నిల్చిపోవును. ఇది మనవ్యూహమునకెంతయు అనుకూలము.

హుస్సేన్ నిజాంషా : తిరుమలరాయడును, వేంకటాద్రియు తమ తమ సేనలతో రాయలను రక్షింప మధ్యభాగము నకు వత్తురుగదా!

చెలాబి రుమీాఖాన్ : తప్పక వత్తురు, కాని త్వరలో రాలేరు. రాయల సేనయంతయు కల్లోలముగా నుండును. అట్టి సేనలో శత్రువులు చొరబడుటకు వీలు ఎక్కువ; మిత్రులకు వీలుతక్కువ.

హుస్సేన్ నిజాంషా : ఇపుడు నాకును ఆశయు, ఆశ్చర్యమును కల్గుచున్నవి, అయ్యును రాచవీటిసైన్యము, వేంకటాద్రి, తిరుమలరాయడు నోటమి నంగీకరించువారు గారు.

చెలాబి రుమీాఖాన్ : ఇప్పటి మనలక్ష్యము కేవలము జయము గాదు. రామరాయలను బంధించుట, లేక చంపుట. అందుకు వలయు సంక్షోభము ఈ వ్యూహామువలన సాధ్యపడును. ఇది నిస్సందేహము. అదియునుగాక కుమార మరణదుఃఖముచే తిరుమలరాయడును, గాయముల బాధచే వేంకటాద్రియు యుద్ధమందు విజృంభింప లేరనుకొందును. ఇదియును మన ప్రయత్న ములకు అనుకూలమే.

హుస్సేన్ నిజాంషా : మంచిది, మనప్రయత్నమున ఏమియు లోపములేదనియే తోచుచున్నది. అల్లాదయ ఎట్లు న్నదో?

కిస్వరీ ఖాన్ : వేంకటాద్రి అఖండుడు. అతని శౌర్యము అనంతము. హస్తమునందు గాయమువలన మిక్కిలి బాధపడుచున్నాడు. ఇపుడు విజృంభింప లేడనుకొందును. ఎట్లైనను అతనిని ఎల్లవిధముల అరికట్టి తీరవలయును.

ముస్తాఫాఖాన్ : తిరుమలరాయని శౌర్యము మొక్కవోపనిది. దిగులుచే నిపుడు నిర్వీర్యుడగునేమో! అయినను సర్వవిధముల నాతనిని కనిపెట్టియే యుండెదను.

చలాబి రుమీాఖాన్ : ఈ మహాప్రయత్నము వృథాకారాదు. మనమందరముకలసి నేడు రామరాయలను పట్టితీరవలయును. రహస్యముగా దాచియుంచిన ఫిరంగుల వ్యూహము పూర్వము వ్యర్థమైనందుకే మిగుల వగచుచున్నాను.

## 7

(రాయలు, వీర వెంకన్న ప్రవేశింతురు.)

వీర వెంకన్న : మహాప్రభూ! కొంప మునిగినది.

రామరాయలు : సంగతిఏమి, వెంకన్నా? అట్లు ఉద్వేగవంతుడవగుదువేల!

వీర వెంకన్న : మనసేనలోని యిరువురు మహమ్మదీయసేనాపతులు చెప్పరానిద్రోహము చేసినారు. ఇంటతిని,

ఇంటివాసములు లెక్క పెట్టినారు.

రామరాయలు : అయినుల్ ముల్కు భాయియా ?

వీరవెంకన్న : భాయియో, బండలో. అతడే రాజద్రోహి; కృతఘ్నుడు.

రామరాయలు : రెండవవాడో ?

వీరవెంకన్న : అతని బంధువట. అతనితో పాటు సేనానిగా నున్నవాడట.

రామరాయలు : వారిరువురను బట్టి బంధించినారా ?

వీరవెంకన్న : ఎవరు బంధించినారు ప్రభూ! సేనయంతయు కలవరము చెందియున్నది. ఎవరు ఎవరి నెదుర్కొనుచున్నదియు తెలియవచ్చుట లేదు. మొగ్గరమంతయు క్రమము దప్పి క్షోభించుచున్నది.

రామరాయలు : వీరవెంకన్నా ! ఊరకే గాభరాపడకుము. ధారిత్రీయుము. సేనలను స్వయముగా చూచి వచ్చెద. ఓయీ, ఎవరక్కడ !

భటుడు : (ప్రవేశించి) ప్రభూ ! ఏమియాజ్ఞ !

రామరాయలు : సింహాసనపు పల్లకీ తీసికొనిరండు.

వీరవెంకన్న : ఇపుడు పల్లకీయా, మహాప్రభూ !

రామరాయలు : వెంకన్నా ! ఊరకే తొందరపడకుము. ఇపుడేమి ముంచుకొనిపోయినది. మన సామ్రాజ్యభారమంతయు ఇరువురి రాజద్రోహులచే కూలిపోవునా ? క్షణములో సేనలను క్రమబద్ధము చేయుదుముగాక.

పల్లకీ వచ్చును. రామరాయలు అందెక్కి వీర వెంకన్నతో గలసి సేనలను పురికొల్పుచు పోవుచుండును. రాయలను చూడగానే సైనికులందరు నూతనోత్సాహభరితులై కాలు నిలువద్రొక్కుకొనుచుందురు. కాని ముందలి సేనాభాగములు వెనుకకు విఱిగి పడుచుండెను.

వీర వెంకన్న : మహాప్రభూ! ఎక్కడనుండియో అంతులేని ఆశ్వికసేనలువచ్చి మన సేనాముఖములను చీకాకు పఱుచుచున్నవి. అయినుల్ముల్కు లేవదీసిన పితూరి మనసేనయంతయు వ్యాపించుచున్నది. ఎవరు ఎవరితో పోరాడుచున్నారో తెలియక భటులు త్రొక్కిసలాడు చున్నారు. ఇదేదియో పెద్ద కుట్ర.

రామరాయలు : ఆవలివారి సేనలు చెక్కుచెదరక క్రమబద్ధముగా వచ్చుచున్నవే ?

వీర వెంకన్న : ఔను ప్రభూ! ఇదేదియో పెద్దకుట్ర. ఇది మహాదుర్దినము. చూచుచుండగనే మన సేనలన్నియు దుర్దశ పాలగుచున్నవి.

రామరాయలు : (ఆలోచించుచు) ఏమి ఈ విపరీతము !

వీర వెంకన్న : ప్రభూ ! ఒక్కమనవి. తమరు శిబిరమునకు వేంచేయుడు. ఇచ్చటి సంగతియంతయు నేను చక్కబఱచుకొనియెద. తమరిట్లు పల్లకీలో తిరుగుచుండుట క్షేమకరముగాదు. నామనవి వినుడు. వేంకటాద్రి, తిరుమలరాయలు ఇంతలో రాగలరు. మేమందరము వచ్చి

తమదర్శనము చేసికొనగలము. సేనాగ్రభాగమున చాలదూరము వచ్చినారము. ఇది ప్రమాదముగల ప్రదేశము.

రామరాయలు : ఈ సమయమున నీ మహాసేన లన్నింటిని దురదృష్ట దేవతకప్పగించి, నేను శిబిరమునకువెళ్లి సుఖముగానుండుట తగునా? వీరవెంకన్నా ! అధైర్యపడకుము. ఇట్టి క్లిష్టసమయములందె నిబ్బరముతో నుండవలయును.

వీర వెంకన్న : ఇచ్చట పని అంతయు నేను చూచుకొందును, ప్రభూ! తమరు శిబిరమునకు వేంచేయుడు.

అనుచుండునంతలో అహమ్మద్ నగరువారి సేనకు చెందిన మదగజమొకటి బెదరి ఘీంకారములుచేయుచు వెఱ్ఱిపరుగుతో అటకు వచ్చును. అచటి భటు లందరును చెల్లాచెదరై పోవుదురు. అంతలో బోయీలు బెదరి, పల్లకీ విడిచి పారిపోవుదురు. శత్రువుల ఆశ్వికదళములు వచ్చి చుట్టుముట్టుచుండును. వీరవెంకన్న వీరభద్రుడై చేతికంది నంతవఱకు విరోధులను దునుమాడుచుండును.

రామరాయలు : వీరవెంకన్నా ! ఏమి యీ సర్వనాశనము !
(అనునంతలో వెంకన్న శిరస్సుతెగి రాయలపాదములపై పడును).

ముస్తాఫాఖాన్ ప్రవేశించి రాయలను జూచి, దిగ్భ్రాంతి చెంది, నిల్చుండును.

రామరాయలు : ఎవరు నీవు ?

ముస్తాఫాఖాన్ : (బెదరుతీరి) అది నీ కనవసరము. నీవు మా ఖైదీవి.

రామరాయలు : (ఒరనుండి ఖడ్గముదూసి) అవసరానవసరములమాట అటుండనిమ్ము. నీవెవరవో చెప్పుము.

వెనుకనుండి శత్రుభటులు వచ్చి రాయలచేతిలోని ఖడ్గమును లాగివేయుదురు.

ముస్తాఫాఖాన్ : నేను గోల్కొండ సేనాపతిని. ముస్తాఫాఖాన్ అని నన్నందురు. ఇపుడు నిన్ను బంధించి తీసికొనిపోవుదుము (అని రాయలను చెలాబి రుమీఖాన్ శిబిరమునకు తీసికొనిపోవుదురు).

చెలాబి రుమీఖాన్ : (రాయలను చూచుటతోడనే మహోదగ్రుడై) ఈ నాస్తికశిఖామణిపని యీరోజుతోసరి (అని కడ్గము ఎత్తును).

రామరాయలు : (ఠీవిగా నిల్చుండి) నన్ను ఖండించుటకుగాని, ఖండింపకుండుటకుగాని నీవేనా అధికారివి. ఆలోచించుకొనుము.

చెలాబి రుమీఖాన్ : (ఖడ్గముదించి నిస్తేజుడై) ఏమి, ఈతని ఠీవి ?

ముస్తాఫాఖాన్ : భాయీ! ఈ గొడవలు మనకేల! ఈతనిని హుస్సేన్ నిజాంషా ప్రభువులవారి యొద్దకు తీసికొనిపోవుదము.(అంతలో అటకు కిస్వరీఖాన్ గూడవచ్చును.

ముగ్గురును కలిసి రాయలను నిజాంషావద్దకు తీసికొని పోవుదురు).

హుస్సేన్ నిజాంషా లేచి ఎదురువచ్చి "రామరాయలా! ఏమి ఇటకు వేంచేసియున్నారు ?"

రామరాయలు : (ఠీవిగా) ఎటు వేంచేయవలసివచ్చిన అటు వేంచేయక తప్పదు. జయాపజయములు దైవాధీనములు గదా! కష్టసుఖములు ధీరులు లెక్కింపరు.

హుస్సేన్ నిజాంషా : ఎన్ని దినములకు పట్టుపడితివి! ఇంతవరకు మమ్ము ఎన్ని తిప్పలు పెట్టితివి? ముప్ప తిప్పలు పెట్టి మూడు చెరువులనీరు త్రాగించితివే! నాస్తిక శిఖామణి! యిక నీపని ఏమగునో చూచుకొనుము.

రామరాయలు : నాపని ఏమగును? మృత్యుముఖమున పడు దును గాబోలు! ఇంతియేనా ? ఈ దినమున నేను; రేపు నీవు. అంతకంటె ఏమిగలదు! నాకేమి, తొంబదియారువర్షముల వృద్ధుడను. మృత్యుదేవతను సుఖముగా ఆలింగనము చేసికొనుటకు సిద్ధపడు చుంటిని. యుద్ధమున వీరమరణము నందుటకు సంతోషింపవలయునుగదా!

రామరాయలు వృద్ధవదనమునుండి బ్రహ్మతేజము లొలుకుచుండెను. ఆతని ఆజానుబాహువులు సుస్థిరములై యుండెను. ఆకర్ణాంత విశాలలోచనములు

ప్రశాంతకాంతులను వెలిగ్రక్కుచు నిర్భయతను సూచించుచుండెను.

హుస్సేన్ నిజాంషా : ఆ సంగతులన్నియు అటుంచుము. అహమ్మద్ నగరుపై దండెత్తి విజయగర్వోన్మత్తుడవై నీవు చేసిన అత్యాచారములు గుర్తుగలవా? వానికిపుడు ప్రతీకారము జరుగవలదా? అవి నామనమున సూటిగా నాటుకొని వేధించుచున్నవి.

రామరాయలు : సంతోషముగా జరుపుకొనుము. నేను వలదనను. కాని ఒక్కమాట. అత్యాచారములంటివే, అట్టివి సాధారణముగా సైనికులు విజయోత్సాహమున చేయుచుండు పనులు. రాజులప్పుడు క్షాత్రతేజః ప్రకటనార్థము వానినిచూచి, చూడకయుందురు. అట్టివి నీవు జయించినప్పుడును జరుగుచునె యుండును. వానిని కొండంత చేయుట రాజధర్మము కాదు. అంతియేగాని నాకు నీపై గాని, నీ రాజ్యముపై గాని, నీ మతముపై గాని ఎట్టి ద్వేషములేదు.

హుస్సేన్ నిజాంషా : లేదా?

రామరాయలు : ముమ్మాటికి లేదు. ఇది నీదయాభిక్ష వేడి చెప్పుమాటగాదు. నా రాజ్య పరిపాలనావిధానమును జాగ్రత్తగా పరిశీలించినచో సర్వము నీకే తెలియగలదు.

హుస్సేన్ నిజాంషా : ఏమి తెలియగలదు?

రామరాయలు: నీపై గాని, నీ రాజ్యముపై గాని ద్వేష మున్నచో అహమ్మద్ నగరమును, నిన్ను జయించి, నీ రాజ్యమును ఆక్రమించెడివాడనే. నీ మహమ్మదీయ మతముపై నాకెపుడును ద్వేషములేదు. హిందూమత మును సంరక్షించుకొనటయే నావిధి. అందులకై యితర మతములవారిని ద్వేషింపనక్కరలేదు.

హుస్సేన్ నిజాంషా: ఏమి శ్రీరంగ నీతులు?

రామరాయలు: ఔనుభాయీ! నేను చెప్పునది పరమసత్యము. శ్రీరంగక్షేత్రమందలి శ్రీరంగనాథుని సతీవర్గమున బీబీనాంచారు అను తురకబాలను దేవేరిగా మన్నించుచు, పూజించుచు వచ్చుచున్నారు విజయనగర ప్రభువులు. పెనుగొండలో బాబయ్య దర్గీ అను పేరబరగు మహమ్మదీయ సాధువుసమాధి గలదు. దాని నిత్యపూజారాధనలకు తొమ్మిది గ్రామము లను ఈనాముగా ఇచ్చియున్నారు విజయనగర ప్రభువులు.

హుస్సేన్ నిజాంషా: ఏమి చాతుర్యము!

రామరాయలు: నీవు ఎట్లయినను భావింపవచ్చును. మరి యొక నిదర్శనము వినుము. శ్రీరంగనాథ దేవా లయము యొక్క లోపలిప్రాకారపు గోడపై "లాహి లాహి ఇల్లల్లా మహమ్మదర్ రసూలులాహి" అను అరబ్బీ మంత్రము, చదరపురాతిపై వ్రాయబడి, అమర్చ

బడియున్నది. ఇది మహమ్మదీయులకు అత్యంత పవిత్ర
మైన మంత్రముగదా!

హుస్సేన్ నిజాంషా: ఔను, అత్యంత పవిత్రమైనమంత్రమే.

రామరాయలు: ఆ మహామంత్రమును నేటికిని అచ్చటి పూజా
రులు ధూపదీపములతో అర్చించుచున్నారు. దానిని
విజయనగర ప్రభువు లనుమతించుచునే యున్నారు.
ఇవియన్నియు పరమత సహనమునకు పరమప్రమాణ
ములుగా నున్నవి గదా!

హుస్సేన్ నిజాంషా: ఔను. ఐనను ఇవన్నియు నారాజ్యమున
జరిగిన అత్యాచారములను తుడిచివేయగలవా?

రామరాయలు: అత్యాచారములు అంతగా రాజులకు సంబం
ధించినవి కావని ఇదివరకే చెప్పితినిగదా?

హుస్సేన్ నిజాంషా: ఇక తక్కిన గొడవలతో నాకేమిపని?

రామరాయలు: వాని నన్నిటిని ఏలపేర్కొంటిననగా మా
హిందూ మతోద్ధరణ విధానమును విశదీకరించుటకు.
మా మతధర్మములను ఉద్ధరించుకొనుటయే మా
లక్ష్యము. అంతియేగాని యితర మతముల నణగ
ద్రొక్కుటమాకు తెలియని విషయము. మతము
లన్నియు భగవానుని చేర్చుననియె మా విశ్వాసము.
ఇతరమతముల వారిని నాస్తికులని దూషించుట
మాకు తెలియని విషయము.

చెలాబి రుమీఖాన్: మహమ్మదీయమతము ఇతరమతము

లను అణగద్రొక్కినది యనియు, ఇతరమతస్థులను ద్వేషించునదియనియు నర్థము వచ్చునట్లు ప్రసంగించుచున్నాడు ప్రభూ, ఈ నాస్తికుడు.

హుస్సేన్ నిజాంషా : (రోషముతో) ఈ నాస్తిక శిఖామణి ఎంతపనియైనను చేయగలడు. ఇత డున్నంతవరకు మాకు సుఖము, శాంతి లేదు. వీనిమదము అణచవలయును. అంతటితోగాని మాపీడ వదలదు.

చెలాబి రుమీఖాన్ : అవును ప్రభూ, మా యందఱ అభిప్రాయములు అట్లేయున్నవి. శత్రువుచేత జిక్కినప్పుడు విడువరాదు. అది నీతియుగాదు.

రామరాయలు : నిజాంషా! రమ్ము. లేచిరమ్ము. నేను మృత్యువునకు జడియను.

(చేతులు జోడించి, నిమీలితనేత్రుడై)

"తమేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి."
"ఏక మే వా ద్వితీయం బ్రహ్మ."

అని ఉపనిషత్తుల మహావాక్య భాగములను పారాయణము చేయుచుండును.

హుస్సేన్ నిజాంషా : (రోషముతో లేచి) దేవుడు నన్నేమి చేసిన చేయనిమ్ము; పాపము రానిమ్ము; పుణ్యము రానిమ్ము. ఈ నాస్తిక శిఖామణిని, ఈ పరమశత్రువును చేతులార చంపి కసితీర్చు కొనవలసినదే.

(అనుచు ఖడ్గమెత్తి రామరాయలు శిరస్సును ఖండింపనుండును.)

ఆ వృద్ధ కంఠమునుండి "హరహర మహాదేవ, (శ్రీ) విరూపాక్ష మహాదేవ" అను మహానాదము భూ నభోంతరాళములు పిక్కటిల్ల వినవచ్చెను.

రత్నఖచితమైన కిరీట కాంతులు వెలుగొందుచుండగా కందక, గాజువారక, వికారమునందక వృద్ధమహారాజు వీర సుందరవదనము చిరునవ్వు లొలయగా భూమిపై పడును. వృద్ధమహారాజు వీరస్వర్గము అలంకరించును.

సంపూర్ణము



# సంస్కృతి ప్రచురణలు

10. సోవియట్ల దేశం(శశి) .... 0-10-0
11. నేటిచైనా (పింగళి పరశురామయ్య) .... 0-10-0
15. లెనిన్ (క్లారా జట్కిన్) .... 0- 8-0
17. హిందూ పద్ పాదుషాహి (వి. దా. సావర్కర్) 2- 8-0
19. ఇండియా స్వాతంత్ర్య సమస్య (డి. యన్. ప్రిట్) 0- 8-0
21. సుభాస్ బోస్ అంతర్ధాన గాథ (ఉత్తమచంద్).... 1- 8-0
22. గాంధీతో ఒకవారం (లూయీ ఫిషర్) .... 1- 8-0
23. నా జీవితము (గాంధిజీ) ... 1- 8-0
25. సామ్రాజ్యం (లూయీ ఫిషర్) .... 1- 0-0
26. మహమ్మదీయ రాజ్యాలలో జాతీయ వికాసము.... 1- 8-0
(కాశీపట్నం కొండయ్య)
27. నాగరికత చరిత్ర (సి. ఇ. యమ్. జోడ్.) .... 1- 4-0
28. ప్రపంచ చరిత్ర (నెహ్రూ) (2) ... 2- 0-0
29. భారతీయ నాగరికత (సి. ఇ. యమ్. జోడ్) .... 1- 8-0
30. మన వారసత్వము (హుమయూన్ కబీర్) .... 1- 8-0
31. ప్రపంచ చరిత్ర (నెహ్రూ) (1) I ... 1- 4-0
32. ప్రపంచ చరిత్ర ( ,, ) (1) II ... 1- 0-0
33. ప్రపంచ చరిత్ర ( ,, ) (3) ... 2- 0-0
34. ప్రపంచ చరిత్ర ( ,, ) (4) ... 2- 0-0
35. జీవితాదర్శం (చలం) .... 0- 8-0
36. విజ్ఞాన భాస్కరులు (కస్తూరి సూర్యప్రకాశరావు) 1- 0-0
37. సర్దార్ పటేల్ (టి. బదరీనారాయణ్) .... 1- 0-0
38. వసంతము (బద్దెపూడి రాధాకృష్ణమూర్తి) . .. 1- 0-0
39. విజ్ఞాన శేఖరులు (కస్తూరి సూర్యప్రకాశరావు) .... 0-15-0
40. నా చిన్నప్పుడు (గాంధిజీ) .... 1- 0-0
41. వీర స్వర్గము (ప్రతాప రామకోటయ్య) .... 0- 8-0
42. సోవియట్ రష్యా (నెహ్రూ) ... 1- 0-0
43. ప్రపంచ చరిత్ర (నెహ్రూ) (5) ... 2- 0-0
44. తెనుగు - ఇంగ్లీషు నిఘంటువు ... 5- 0-0

# పిల్లల పుస్తకాలు

1. లక్కపిడతలు (చింతా దీక్షితులు) .... 1- 0-0
2. శంపాలత (త్వరలో వెలువడును.) ... 1- 0-0

# ఇతరులవి

1. సుందర్ (సౌరీస్) .... 3- 0-0
2. ప్రతిమా నాటకం (భారతుల మార్కండేయ శర్మ) 1-10-0
3. పిచ్చి-పాటి (నార్ల) .... 1- 8-0
4. మాట-మంతి (నార్ల) .... 1- 8-0
5. ప్రజావిరోధి (విశ్వం) .... 2- 0-0
6. రానున్న సంక్షోభం. అనువాదం: విశ్వం. .... 6- 0-0
7. అన్నకెరినీనా. అనువాదం: తాపీధర్మారావు .... 6- 0-0

---

సంస్కృతి ప్రచురణలు

పిల్లల పుస్తకాలు

అపూర్వ గ్రంథములు



ప్రకాశకులు :

కల్చరల్ బుక్స్ లిమిటెడ్

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు : : మద్రాసు - 2